వర్త.—[స్వగతము] ఆహాహా ఏమి యీతనియుక్తి? [ప్రకాశము] మేము శాశ్వతముగా మీకు వర్తకులముగా నుండఁగోరుచు, మామాటమీదనే వెలలు పరిష్కరించుకొనుట వ్యాపారధర్మములో మాకు అపకీర్తికి కారణము, పిమ్మట సందేహముల కాస్పదము, కావున ఆసరకులకైనను వెలలు తీర్చుటకు తమకు ఆవిద్య తెలిసినవారు కావలయును. అందుకై యెవరిని రప్పింతురో వారివలననే యీ నజరువస్తువులకుఁ గూడ వెలలు తెలిసికొనుఁడు. ఏలినవారు విచారించి అట్టివారిని రప్పించిన ఉభయులకు తృప్తి యగును.

క. ఢిల్లీ ఢిల్లీ యనుచుం
ముల్లోకములందు [1]దవిణ మ్రోఁగెడు నఁట! యా
ఢిల్లీలో వెలతీర్పరి
కల్ల యయిన నింక నెందుఁ గలుగు ధరిత్రిన్! 3

సు.—[ఆత్మగతము] అరే! వీళ్లు నావల్ల మోసంపోరు. మరి యేమి చేస్తాం? [ప్రకాశము] వర్తకులూ, మీరు ఇంతకిముందు మాసంస్థానానికి యెప్పుడైనా వచ్చినారా? అప్పుడు ఖరీదులు ఏలాగ నిశ్చయించుకొన్నారు?

వర్త.—ఇంతకు పూర్వము మేము ఈసంస్థానమునకు రాలేదు.

సు.—మేము తప్పితే యీదేశంలో మీసరుకులు ఎవరు కొంటారు?

వర్త.— (స్రగ్ధర.)

ఏ రేకోస్తావి తేనిం, డెటులు తెలియనిం, డెంత [1]మూల్యంబుగానిం,
డోరంగోల్పాదుపావా రొకరె [2]విలుతు రభ్యున్నతశ్రీసమృద్ధిన్.
వారి ద్దర్శింపనే యీ[3]వరమణినజరుల్ వస్తువుల్ గూర్పనయ్యెన్;
వారున్న న్వేఱుచోట న్వదమిడుదుమె దైవంబుహా! యోర్వదాయెన్!

సు.—అంతధనం వుందా వారికి?

---

3. 1. చర్మవాద్యవిశేషము.

4. ఏరు ఏకోస్తావి తేనిండు = ఎవరు ఏకోస్తాసరకులు తెచ్చినను,
1. వెల, 2. కొనుదురు, 3. మేలురత్నముల కానుకలు.

వ ర్త.—అడ్డ మేమి?

సు.—వారికి ఖరీదులు ఎవరు తీర్చడం?

వ ర్త.—వారే అందఱకు తీర్తురు. ఆవిద్యలో వారు మహానిపుణులు, వారు వేసినవెలలకు మేము బదులు చెప్పుటలేదు.

సు.—మరియిప్పుడు మీరు వేరేసంస్థానానికి రావడానికి వారేమైనార్?

వ ర్త.—మాదురదృష్టముచేత, ఆమహారాజు తమసర్దార్లతోడి యుద్ధములో స్వర్గస్థులైనారని మాయడితిదారులు మాకు తెలిపినారు. దేశమంతట అదే కింవదంతి. అంతట మేము వంశపరంపరగా నున్న యీవర్తకము మానలేక యిటకు తమదర్శనమునకు వచ్చితిమి.

సు.—[జనాంతికము] ఏమి వలీఖాన్, మనవేగులు తెలంగిరాజాకి మర్గయా చెప్తారు, ఓఁళ్లుకూడామర్గయాచెప్తారు, మనం అతనికి ఊరేగింపుచేసి ఖైదులో వుంచినాం?

వలీ.—[జనాంతికము] ఆబడాలడాయిలో రాజా ఏకాకి మనదండు దూరి చంపిచంపి మనచేతులో పడ్డాడు, మరి అతనివాళ్లకి అగ్పడలేదూ, వాళ్లు చచ్చినాడు తలచినారు.

సు.—[జనాంతికము.] మరి యితనిగలి వాళ్లు విచారించుకోలేదా?

వలీ.—[జనాంతికము] ఎవడిప్రాణం వాడు విచారించుకొని పారిపోయినాడు. మరి మంత్రులు, ఫౌజాదార్లు, రాజా వున్నాడు తెల్సుకుంటే, రాజాకి విడిపించుకోవాల; ఆపొన్యం వసి. అందులో తాము చావడం. రాజా చచ్చిపోయినాడు చెప్తే రాజ్యం తాము హరించవచ్చును. అందుచేత రాజా చచ్చిపోయినాడుఖుదావాండ్ వాళ్లు కొంచెం వుష్నది, కొండంత చేసినారు వుంటుంది.

సు.—[ఆత్మగతము] అచ్ఛా అచ్ఛా! [ప్రకాశము] వర్తకులూ, రాజా మర్గయా అయితే, యిప్పుడు సంస్థానానికి మీసర్కారులు యుగంధర్మంత్రి కానరాదా!

వర్త.—వారున్న మాకు లోటుమేమి? వారు రామేశ్వరములో మరిడీ బాధ్యము వలన స్వర్గస్థులైనారని మాయడిలిదార్లు వ్రాసినారు. లోకమంతయు నదే కింవదంతి.

వలీ.—[జనాంతికము] మనవేగులు కూడా అలాగే చెప్పినారుగదా?

సు.—[స్వగతము] అచ్ఛా! అచ్ఛా! [ప్రకాశము వర్తకులతో] వారికి మీకీ చాలా స్నేయం పరిచయం వుంటుందా?

వర్త.—మాయన్నగారు ఇరువదిసంవత్సరముల క్రిందట వారిని స్వయముగా దర్శనము చేసికొన్నారు. అదిమొదలు, మాయడిలిదారులే వారితో నూవర్తకమంతయు జరుపుచుండిరి. అట్లే ఇప్పుడు తమకటాక్షము మాయందుఁ గలిగిన, మేము ఇచట గొప్పసాహుకారు నెవరినైన తమసంస్థానముకోసము అడితి యేర్పరచుకొని పోయెదము.

సు.—[జనాంతికము] వజీర్సాహేబుకు, మనము ప్రతాపరాజాకి యిక్కడికి తెప్పించి ఖరీదులు చెప్పింతామా?

వజీర్లు.—అదే సర్కారుక్కు చెప్పవాలా వుంటాం.

వలీ.—[ఆత్మగతము] చాకలి వెల యేలాగా వేస్తాడు? రాజా కాదు మహాలాక్వాలా తెలిస్తే నాతలకే వస్తుంది. ఈవర్తకులు రాజాకి తెలుసుకొంటారు భయం చెప్పడానికి లేదు. సుల్తాను తెప్పించకమానడు, నాగతి గాభరావుంది. [చింతించి] అయినా యేమి భయం? యమధర్మరాజుమహాయం వుంది.

సు.—[జనాంతికము] ఏమివలీఖాను బహద్దర్, నీమనస్ తెల్సలేదు?

వలీ.—[వణఁకుచు విలక్షుండై] రచ్చించవచ్చును నానమన్.

సు.—[జనాంతికము] వజీరాలీ, నీవు పోయి ఆతెలంగిరాజా ఖైదీకి మనవాడు సౌదాగర్ వేషంవేసి తీస్కానిరా. [నవ్వుచు] ఆయనదాడీ యీఆడుచండల్లీ మనకీ యిప్పుడు పనికీ వస్తుంది.

వజీ.—సర్కార్ అజ్ఞ. [అని నిష్క్రమించును.]

సు.—మంగిది గోవావర్తకులూ. మారాజ్యంలో మీసరుకులకీ ఖిమ్మత్

చెప్పేవారు లేరు మీరు కల్లవద్దు. మీమాటమీద యిప్పుడు రాచేస్తాం. మరి వారి నిఘా ఖరారు అవునో కాదో మీకే యేలాగ దాఖలా?

వ_ర్త.— ఈనజరువస్తువులకు వారు వేయంవెలలను బట్టి తెలిసికోఁగలము.

సు.—వారు చాలా గొప్పవారు. మనమంతా వారికి తాజీం చెయ్యా వాలా. వారు వక్కాటు మాకే కాపల్సీ నూరుకోట్ల వరహాలు అప్పుయిచ్చి మళ్లి మేమురయెంత బతిమాలినా పుచ్చుకోన్నారు లేదు. అందుకు వారికి మాకే భాయిభాయి స్నేహం మర్యాద, చూడండి మీ పెర్తాపరాజాకె వారికి నిఘా తై ఫార్.

వ_ర్త.— జగత్ప్రభువు చిత్తము.

అంతట ప్రతాపరుద్రమహారాజు తురకసౌదాగరువేషమున వజీరాలితో ప్రవేశించును.

[సభ అంతయు లేచును.

సు.—[రాజు చేయి పట్టుకొని] సలాం సలాం. ఇక్డ ఇక్డ భాయి.
[అవి తన ప్రక్కను కూర్చుండఁ బెట్టును. రాజు
సమకాలమందే సలాముచెప్పి కూర్చుండును.

సు.—సౌదాగర్ సాహెబ్, మీకె శ్రమ యిచ్చినాం. కానిం యీసౌదాగర్లు. వీరు యీనజర్లు తెచ్చినార్. ఖరీదులు చెప్పము అంటార్. తమరు వీటికి ఖరీదుచెప్పి మనవర్సుపిల్పవాలా. యిందుచేత తమ వెస్టనం అయింది షంలోషంగదా.

రాజు.—[ఆవస్తువులను పరీక్షించునట్లుగాఁ జూచుచు, ఆత్మగతము] ఆహా యుగంధరులవారి మహిమ! ఈవస్తువులు నాయంతిపురములోని వే, వీరు నావ_ర్తకులే. నాకు ఈవిధమే ప్రయాణసుముహూర్తము. [ప్రకాశము] భోత్ అచ్ఛా. వీరివల్ల తమ దర్శనం లాభం. యీకారణంగా వీరికి మా స్నేహం వుంది. మరియిప్పుడు వీరికి మేము పరీచ్ఛా చేస్తాం, వీరు మాకే పరీచ్ఛా చేస్తారు. ఒకరిఖరార్ ఒకరికి తెలుస్తుంది ఛణంలో.

[సుల్తాను రాజుచేతికి నెమలి నందించును.

రాజు.—[నెమలిని త్రిప్పి త్రిప్పి చూచి, లెక్కలు వేసికొనుట నభినయించి] సుల్తానుభాయి ఈనెమిలి షుమార్ రెండుకోట్లు, యీఖైలషల్ వర హాల్. కోట్లు కచ్చ ఖరీదు, యిర్వైవైదు లక్షలు తలిమ్మా రాళ్లు, యిర్వైవైదు లక్షలు కూలి. ఏమి చెప్తారు సౌదాగర్లు ?

వర్త.—[ఆశ్చర్యముతో] అన్నిటికి చెప్పి కానిండు.

రాజు.—అదీ కాదు. సరియైతే పైస చెప్తాం, లేకపోతే యెందుక్కు చెప్తం?

వలీ.—[ఆత్మగతము] క్యారే, ఇతడు ఆరునెల్లు బందీ వున్నా ధేధీష్య మానం వున్నాడు. మంచి తెల్విత్తో మాట్లాడుతాడు, మహాల్జికాడు తోస్తుంది. [విమర్శముతో] లేక, మంత్రి యుగంధర్ ఆట్వంటి తెల్విగల చాకలికి వంపాదించి వుందునా మాకీ మోసం చెయ్యడానికి ?

వర్త.—తమరు చెప్పినది సరి కావుందునా? మాకొక యాశ్చర్యము కలుగు చున్నది. మనవి చేసెదము, అన్నిటికి సెలవిండు.

రాజు.—మంచిది. ఈనజ్రంపూర్యుడు [లెక్కనభినయించి] యిర్వైవైదు కోట్లు, పని సవా. ఈహద్దం [నరల లెక్కనభినయించి] పది వైదుకోట్లు. ఈతామ్ర ఖమలం పదికోట్లు, అంతా కని సవా. ఏమి మీహాశ్చర్యం ?

వర్త.—జగత్ప్రభూ, మీరు సాక్షాత్ప్రతాపరుద్రులవారే! స్వర్గస్థులగుట అబద్ధము!

[సవిస్మయము, ఆత్మగతము] క్యారే! కనిపెట్టివేశినార్ !

వలీ.—[ఆశ్చర్యముతో] ఖుస్రూ, జోస్యులుభాయి, చాకలీ చెప్తారు! పీర్లు రాజాచెప్తారు! క్యారే ఇది!

వర్త.—వీరిదేహములో పరకాయప్రవేశము చేసినా రని మాకు తోచుచున్నది. మంత్రియుగంధరులవారికి అట్టిశక్తులు కల వని మేము వినియుంన్నాము. ఈపెలలు అమహారాజే వేసినా రని చెప్పవచ్చును.

వలీ.—[హర్షముతో ఆత్మగతము] బలే బలే వాళ్ల మాట అది కాదు! మాకీ యమధర్మరాజా మహాయం నిజం నిజం.

సు.—[ఆత్మగతము] వాళ్లు వట్టి చెప్తే మేము మరి వట్టి తెలుసు కొన్నాం. [ప్రకాశము] ఖరీదులు అంత సరిగా వున్నవా,

వర్త.—ఉన్నవి.

సు.—వీరి ఖరాప్రకారము లెక్క లేక వప్పుకుంటారా?

వర్త.—ఒప్పుకొనిగొందము.

వలీ.—[ఆత్మగతము] బలే! యమధర్మరాజా మహాయం! బలే! యమధర్మరాజా మహాయం!

సు.—ఒప్పుకోకపోతే?

వర్త.—మమ్మందఱను శిరచ్ఛేదము చేయింతురు.

సు.—ఇదే మరత్? నిశ్చయం?

వర్త.—ఇదే మరత్, నిశ్చయము.

సు.—అచ్ఛా! అచ్ఛా! [జనాంతికము] మహారాజాభాయిః వీళ్ల సరుకులు అన్నిటికి సున్నమానం ఖరీదులు వెయ్యండి. మేము మరత్ప్రకారం పుచ్చుకొంటాం. ఒప్పుకోకపోతే శిరచ్ఛేదం పుచ్చుకొంటాం. మీకి యీ స్నేహానికి వోడంగోల్కు వదిలివేస్తాం. మరి తమరు బందిఖానాకి రావద్దు. జవాబు చెప్పండి భాయి.

రాజు.—[ఆత్మగతము] ఎంత నిర్భాగ్యుఁడు వీఁడు! అన్నకుమారుని శిశువును చంపి రాజ్యము హరించినవానికి ఈచింత యెంతపాటి! [జనాంతికము] సుల్తాన్ భాయికి జవాబ్ వడిమాటలు యెందుకు? మరి యిక్కడికి రాం.

సు.—అచ్ఛాఅచ్ఛా! మరైతే వర్తకులూ, ఈ దివాణం దివాణంగానే మీవాడలకి వస్తాం, లెండి.

వర్త.—మహాప్రసాదము! మహాప్రసాదము!

[అందఱు లేచి పరిక్రమింతురు.

సు.—[పరివారముతో] సికారీకి సర్వం సిద్ధమా?

పరి.—బందగానె ఆలీ, మీకీ అంబార్లు ఏనుగులు పహాదాలు వేసి తయ్యార్ వున్నవి. శిబ్బందికి గోడాలు జీన్ వేసి సిద్ధం వున్నవి. శస్త్రం సిద్ధం.

సు.—భోత్ అచ్ఛా! ఈసవార్లు మాపహాదాలలో అలంకరించి మాకంటికి విందుగా చూస్తూడాసే వాడవికి లెండి.

[పరివారము వెచ్చును. అందఱు పరిక్రమింతురు.

స్థలము 2. ఢిల్లీలో వీథి.

[నేపథ్యమున]

ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్,
ఇదుగో ఇప్పుడే పట్టుకపోతాన్,

[మరల మరల అట్లే?

సు.—[ఆశ్చర్యపడుచు] అరే! ఎవడ్రా మాకీ పకిల్లేవు అరుస్తాడు. చెవికి తెలుస్తుంది?

వజీర్లు.—బందగానె ఆలీ, వాడే ఆదివానా తెలంగి.

సు.—మేము చూడవాలా, మేము చూడవాలా.

అంతట వెఱ్ఱివాఁడు ప్రవేశించును.

వెఱ్ఱి.—[తటాలున దారికడ్డము వచ్చి సుల్తానుముందఱ ఆడంబరముగా నిలుచుచు] ఢిల్లీసుల్తాన్...[ఉత్తరప్రత్యుత్తరము పిల్చుచు] ఢిల్లీసుల్తాన్... [చుట్టకాల్చుట నభినయించుచు] ఢిల్లీసుల్తాన్...[హుక్కాత్రాగుటను వెక్కిరించుచు] ఢిల్లీసుల్తాన్...[అనుచు సుల్తానువారి యేనుఁగుముందఱ నిర్భయముగా నిలుచును.

పరి.—దారి కడ్డం లేరా, అరే దివానా. [అని ఆవలికి త్రోయుదురు.

వెఱ్ఱి.—నేను కదలను, ఏమి చేస్తావు?

పరి.—కదలలేకపోతే ఖుర్రా యెగ్రా యేస్తాం.

వెఱ్ఱి.—అహా సుల్తాన్, నిన్ను నేను మాయింటికి తీసుకొనిపోతూ

వుంటే వీళ్లు నన్ను అడ్డుతున్నారు. వీళ్లను పిల్చుకో, లేదా, నేను వీళ్లను చంపివేస్తాను.

సు.—ఎదీ చంపూ చూస్తాం?

వెట్టి.—చంపూ చూస్తాం ఏమిటి? చంపూ యేడుస్తాం, అను. [అని పరిజనులను ఒక్కొక్కని] ఆటుగో అరటిపండు. [అనుచు ఒక్కతాపు తన్నుచు, ఒక్కొక్కనింగాంచి] అబ్బో! నీ వెంతవాడవు! చావకముందు బతికే వున్నావు, నీకు శక్తుంటే నన్ను ఘరం వెయ్యవూ! నీవు చస్తే మరి బతికవు.

[జవానులు తాపున క్రిందు పడి, లేచి, కత్తు లుంకించి, సుల్తానువైపు చూతురు.

సు.—క్యారే ఏమి పడిపోయినార్?

పరి.—సర్కార్, వాడికి సింహంవుంది వంట్లో, వాడు సైతాన్! మనిసి కాడు.

సు.—వాడికి ఏమీ చెయ్యకండి, మాముందర తమాషాలు చేస్తూ రాని య్యండి. వాకి కేమైనా చేస్తే మాతల్కాయా పోతుంది.

[అందఱు పరిక్రమింతురు.

వెట్టి.—[పరిజనులను పాటగా] ఏమి రోయి, మనిసి, మనిసి, మనిసి కత్తి వుంకించావే, ఏమి చేశావు? కాకు, ఎవరిబుర్ర యెగురుతుందో? ఢిల్లీ సుల్తాను ...

పరి.—సర్కార్ హుకుం అయ్యెఖాకా నీబుర్ర బిగురుతుంది. తర్వాత యెగురుతుంది. [అని జవానులు వెట్టివానిని అత్యుగ్రముగా చూతురు.

వెట్టి.—నా బంగారుసుల్తాను, నీవు మావూరికి వచ్చి, నాకు శూన్యం పెట్టిన రాగణ్ణి వీరణ్ణి ఎక్కి తొక్కి నొక్కి ముక్కి రక్కి డొక్కి చెక్కి చక్కాడవలిశింది. ఇది మాప్రార్థన, మనవి, వేడుకోలు, నంగడోలు, గడోలు, డోలు, లు, ఉ. [అని నానావిధములు వికారములు చేయును.

సు.—ఆహో దరికి చేరినాం! పడవలు కనిపెట్టుకొని వున్నవి. యెక్కుదాం.

స్థలము 3. యమున, పడవలు.

[అందఱు అవరోహణారోహణములు నటింతురు. సుల్తాను, రాజు, వలీ, పెద్దసెట్టియును ఒకపడవనే యెక్కుదురు.

వెఱ్ఱి.—నీళ్లు దొరకినవి. నేను బాపనాట ఆడతా.

[అని బ్రాహ్మణులను వెక్కిరించుటగా సంధ్యవార్చును.
వెఱ్ఱి. ఏపడవకుఁ బోయినను అందలివారు రానీరు.

వెఱ్ఱి.—[ఒకపడవచుక్కానిని పట్టి యీడిగిలఁబడి] ఓసుల్తాను, వీళ్లు నన్ను రానీయరు, హో! [అని అఱచును.

సు.—[పడవవాండ్రతో] వాడికీ మాపడ్వలోనే యెక్కించండి.
[పడవవాండ్రు అట్లే చేయుదురు.

వెఱ్ఱి.—తోసిన వెధవలే బుద్ధిమంతులు. ఎక్కించుకొన్నగుండులకే బుద్ధి లేదు, నాకు నెనరు లేదంటే చెప్పట్టుకొ్కదతా. నామట్టుకు నేను పాడు కొంటా, వద్దన్న వాళ్లని ఏట్లోకి తోస్తా.

ఢిల్లీ సుల్తాన్ పట్టుక పోతాన్,
ఇదుగో ఇప్పుడే పట్టుకపోతాన్.
[1] వీరణ్ణి రాగణ్ణి మన్ను చేయిస్తాన్,
ఇదుగో యిప్పుడే మన్ను చేయిస్తాన్.
గోతిలో పాతించి గోరీ కట్టిస్తాన్,
ఇదుగో ఇప్పుడే గోరీ కట్టిస్తాన్.
[2] గుల్లోవ కొల్పాగ కాయల్ కొట్టిస్తాన్,
ఇదుగో ఇప్పుడే కాయల్ కొట్టిస్తాన్.

సు. తప్పు కడమవారు.—ఓయి, అల్లరి చేయకు.

సు.—చెయ్యనియ్యండి. మాకి తమాషా వుంది.

1. వలీఖాను లోనగువారిని, 2. ఓడలో తలకాయ లేయించెదను.

వెఱ్ఱి.—అల్లరి చెయ్యొకూ? అల్లరిచెయ్యొకూ?

[అని పెద్దసెట్టిని వీటవేయ నెత్తును.

[ఇతరులు మాన్పుదురు. వెఱ్ఱివాఁడు సెట్టిని ఖదియ వేయును.

సు. పరిహాసముగా నవ్వును. సెట్టి వొక్కి నభినయించును.

వెఱ్ఱి.— *అల్లవా డిల్లవహో యిల్లవా డిల్లవహో
కల్ల లే నికబోది కడతేర లేను.

ఒరే, లెద్దుగాళ్లూ, పాడండి నావెంట, పాడకపోతే చంపేస్తా.

సు.—పాడండిరా.

వెఱ్ఱి.— అల్లవా డిల్లవహో ...

లెద్దు.— అల్లవా డిల్లవహో ...

వెఱ్ఱి.— †కాలరు ద్రునికంట కాలాన లము లేద,
కాలరు ద్రునికన్ను కాల్చి వేసినదా?

లెద్దు.— కాల ...

వెఱ్ఱి.— అల్లవా ...

లెద్దు.— అల్లవా ...

వెఱ్ఱి.— ‡ పాలసం ద్రముపొట్ట బడబాన లము లేద,
పాలు పొంగించి పాబాలు చేసినదా?

లెద్దు.— పాల ...

---

* అల్లవా—అక్కడి ప్రతాపరుద్రుఁడు ఇక్కడికి వచ్చినాఁడు, ఇక్కడి ఢిల్లీసుల్తాను అక్కడికి (ఓరుఁగంటికి) పోవుచున్నాఁడు. ఇది ప్రత్యక్షమ యయినను మూఢులు ఎఱుంగ లేకున్నారు.

† కాల—ఢిల్లీ కోటలో ఇంతకాలము ప్రతాపరుద్రుఁ డుండెనుగాని ఢిల్లీకోట కేమియు నపాయము చేయలేదు.

పాల— ‡ ఢిల్లీలో కొంతకాలము యుగంధరుఁడను నే నుంటిని కాని, ఢిల్లీకి ఏమియు అపాయము చేయనైతిని.

వెఱ్ఱి.— అల్లవా ...

తెడ్డు.— అల్లవా ...

వెఱ్ఱి.— * ప్రళయకాలము రాగ వడి రెండొకటి గాగ
బ్రహ్మాండ భాండంబు భగ్గు మన లేదా?

[పెద్దసెట్టియు తెల్లవాండ్రును వడవడ వణఁకుదురు.

తెడ్డు.—[కేలుమోడ్చి] సామీ, మాకు బయమవుతావుంది, యిది యేమో చెప్పలేమండి.

వెఱ్ఱి.—చెప్పకపోతే చంపేస్తా.

సు.—వలీసాహేబ్. దేఖో సేట్ జీ గాభరా. [అని నవ్వును.

వెఱ్ఱి.— ప్రళయ ...

పెద్దసెట్టి.—ఇదేమి! యీపీడ మాన్పింపఁడు. నాకుఁగూడ—

[అని యర్ధోక్తిలో భయముతో వెఱ్ఱివానిని చూచి యూరకుండును.

రాజు.—ఏమి సౌదాగర్భాయి, ఉత్తమాటకే భయపడతారూ?

వెఱ్ఱి.—వహవ్వా! తురకవాడికి యేట్లో కడేస్తానని భయం! [అని కక కక నవ్వి] ఊఁ. ప్రళయ ...

తెడ్డు.—ఈయాల ఎవరిమొఖం సూశినామో! యేమి గ్యాచారమో రా!

ప్రళయ ... [వర్తకుఁడు వణఁకును.

వెఱ్ఱి.— అల్లవా డిల్లి ...

[వెఱ్ఱి. తెడ్డు. యథాపూర్వము.

† ఆకాసమున తొఱ్ఱి సోకసను మింగగా
రాకాసులకు దాని రాక తెలిసినదా? అల్లవా.

* ప్రళయ.—ఢిల్లీరాజ్యమునకు వినాశకాలము రాఁగా మేమిరువురము కలయఁగా ఢిల్లీరాజ్యమెల్ల రూపుమాసిపోవుచున్నది.

† ఆకా.—మహావిశాలమైన ఢిల్లీపురములో వెఱ్ఱివాఁడొకఁడు (నేను) ప్రవేశించి ఢిల్లీపురప్రభువును గోసిపోవుచున్నాను. ఈవజీర్లు నాచెయ్యము నేమేని కనఁగలిగినారా?

* భూమిలో నుడి పుట్టి బొక్కపడి వెళ్లావె
అగ్గికం బము మింట నగ్గలిం పంగా. అల్లవా.
[తెడ్డుగాండ్రు వర్తకుడును జలబిరించి వణకుదురు.
† గద్దరెక్కలంగాల, కడలిలో వారి గూల,
సింబోతు నకిలింత సింగాల వింత. అల్లవా.
‡ గుండుగుం డెగిరించి గుండాన దోయించి
అదిరివే టేమూడా యమునికె చ్చరిక. అల్లవా.

సు. రాజా. వలీ.—[కని] ఆహా! వాడలు ఆ దీపాలచేత ఎంత అలంకారంగా వున్నవి?

వెఱ్ఱి.—అల్లదుగో ఆదీపములో వుంది నాభార్య, రాకడీకూన్యంచేత అక్కడచేరింది, నన్ను రమ్మని సంజ్ఞ చేస్తూవుంది. పిట్టలాగ ఎగిరిపోయి కలుసుకొంటాను. [అని ఎగిరి బయటికి దుముకును. పడవలవాండ్రు వెంటనే దుమికి తీసి మఱియొకపడవలో చేర్తురు.

వెఱ్ఱి.—నా పెళ్లాందగ్గిరికి నన్నెందుకురా పోనియ్యరు?
[అని వారిని గొట్టును.

పడవ.—పోవి నీ ననావే యెఱ్ఱోడా!

* భూమిలో.—చెఱసాల లెఱవంబడి ప్రతాపరుద్రుడు వెలుపడి జేదీప్యమానుండై మహోన్నత వైభవముతో లేచి యుండఁగా.

† గద్ద.—సుల్తానుయొక్క సహాయులు వజీర్లు కూలుచుండఁగా, సుల్తానే యమునలో ఖయిది యగుచుండఁగా, తనకు ఈ ఢిల్లీరాజ్యము వచ్చునని ఈ వలీఖానుఁడు త్రుళ్లుచుండుట చెఱకుముకి వర్తకులు లోనగువారికి వింతగానున్నది.

‡ గుండు.—ఒక్కొక్కవజీరుతలను తెగనఱికి వానిదేహమును (రాయికట్టి) యమునలోవైచి, అవృత్తాంతము యుగంధరునికి (నాకు) తెలియుటకుఁగాను అదిరి వేటు వేయవలసినది—అని వర్తకులకు ఆజ్ఞ.

వెట్టి.—చస్తే నాపెళ్లాందగ్గిరికే వెళ్తాను. [అని కొట్టును.

పడవ.—అబ్బబ్బ! యేమి యినపముండాకొడుకురా, చండాలుడు!

[అందఱు ఓడ లెక్కుటను నటింతురు.

స్థలము 4 యమున, ఓడ, పైతట్టు.

వెట్టి.—[వడివడిగా ఆదీపమును బట్టి దాని ముద్దుగొని గడ్డము కాలి] బళి బళి! నన్ను నీవు ముద్దుపెట్టుకొన్నావా? బతికున్నప్పుడు యెంతెంతో బతిమాలుకొంటేనేగాని అనుగ్రహం చేయకపోతివి. పోనీ యిప్పటికైనా దయ కలిగెనా? మళ్లీ ఒకమాటు.

[అని గడ్డముకాల్చుకొని తుడుచుకొనుచు, ముద్దుపెట్టుకొనుటగా దీపమార్చి, ప్రమిద తెచ్చి, మాటిమాటికిముద్దులుగొనుచు, చెవిలో రహస్యములడుగుచు, దానిరహస్యమును వినుచు, ఇతరవిధములను లాలనము చేయుచు, ఉండును, పత్తరులు సుల్తాను ప్రభృతులను కూర్చుండఁబెట్టుదురు. వేశ్యలు ఇద్దఱు సుల్తానునకు, ఇద్దఱు రాజునకు, వింజామరలు వేయుదురు. ఇరువురు తాళవృంతములు వీతురు.

పత్త.—[సుల్తానుతో] కొండంతదేవునికి కొండంతపత్రి తేఁగలమా? 'ఉడుతకు ఉడుతభక్తి.' జగత్ప్రభువువారికి విశ్రామార్థము మంగళార్థమును కొంచెము నృత్యసేవ చేయించెదము.

వెట్టి.—వెట్టిముండాకొడుకులారా, నాకక్కరలేదా నృత్యసేవ? నాకో ఛత్రచామరాలు, విసనకఱ్ఱలు?

సు.—మంచిది, కానియ్యండి. మరి మాకి చేసేమర్యాద అంతా దివానా బహద్దరు వారికి కూడా చెయ్యండి.

[అంతట వెట్టివానిని ఛత్త్రచామరాదుల నుపాసింతురు. నటీ మార్దంగికులు పలువురు ప్రవేశించి సవాద్యముగా ఆడుచు పాడుదురు.

సు.—వహవ్వా! వహవ్వా!

వెట్టి.—అవ్వవ్వా! అవ్వవ్వా! వాడు వహవ్వా అనడ మేమి?

[అందఱు నవ్వుదురు. వెఱ్ఱియుం హా హా హా హా అని నవ్వును. సుల్తాను వర్తకికి ఒకహార మిచ్చును.

వెఱ్ఱి.—[తనగోనెచొక్కా యిచ్చుచు] అది నీళ్లలో మునిగిపోతుంది. నిప్పులో కాలిపోతుంది. ఇదిమునగదు, కాలదు, అందానికి దానబ్బయిది.

[అని వికటముగానవ్వును.

సు.—వర్తకులూ, మాకి యేమి హరాలమధ్య పెట్టినారు! దీనికి మర్తబ్ చెప్పడానికి మాకీ ఖుషీ లేదు, మరి మేము సర్కసులు చూడడం అబద్ధమే.

వర్త.—ఈసరకులు చూచి కానిండు.

సు.—ఏమి వీళ్లకి మాకి అమ్ముతారా?

వర్త.—అమ్మేదము.

సు.—వీళ్లేమి బానిసలా?

వర్త.—దంతపుబొమ్మలు జగత్ప్రభూ.

తురకలు.—ఆహాహా ఏమి హాశ్చర్యం! ఏమి హాశ్చర్యం!

[అని ముక్కుమీఁద వ్రేలుపెట్టుకొందురు.

వెఱ్ఱి.—ఏమివికారము! ఏమి వికారము. [అని ప్రమిదతో] ఒశే, ఈపిశాచాలు నీకు నంవా?

[సు. నటిని తాఁకి చూచును. వెఱ్ఱి. నటిరెండుచేతులు పట్టి జాడించి మొగ్గలు, దండెములు, వేయించును.

సు.—[ఆశ్చర్యపడుచు] ఇట్టియద్భుతాలు ఇంకాయేమేపాటి వుండును?

వర్త.—మాజాబితా చదువుటకు ఒకపగ లెల్ల పట్టును.

సు.—[ఆత్మగతము] ఏలాగైనా వీటి నన్నిటిన్ని లభ్యాయించవల్సిందే. [ప్రకాశము] ఏమి వలీసాహేబ్? మనము ఈరాత్రి యిక్కడే వుంటాం.

వలీ.—నాకీకూడా యీయద్భుతాలు చూడవాలా వుంది, సర్కారు మాయింటముందు చెప్పుకొన్న విందు చేయవాలా వుంది. ఈవేళ విందుకి అనుగ్రహంచేసి రేపు ఇవిచూడడానికి చిత్తం చెయ్యకూడదా, అని గులాం మనవి.

సు.—కడవలు పంపి ఆ విందు యిక్కడికి తెప్పించు.

వలీ.—మహానుగ్రహం, మహానుగ్రహం.

వర్త.—స్నేహితులూ అని తమరే పిలిచినారు. అందుకు ఈరాత్రి మాయింటవిందు పుచ్చుకొని మమ్ము ధన్యులను జేయఁగోరెదము. సర్వము సిద్ధము. స్నేహములో సంకోచము కూడదని తమరే సెల విచ్చియున్నారు.

సు.—ఏమి వజీర్సాహేబులువారి యిష్టం?

వజీర్లు.—సర్కార్ యిష్టమే.

సు.—మంచిది వర్తకులూ.

వర్త.—మహాప్రసాదము! మహాప్రసాదము!

సు.—అట్లైతే త్వరగా వెళ్లి మనకి భోజనంవిందు చేసి, తర్వాత మన కన్నులకీ చెవులకీ మళ్లీ యీవిందూ చేస్తాం, లెండి రండి. [అందఱు లేతురు.

రాజు.—[జనాంతికము] సుల్తాన్ భాయి, తమకు తెలియనిది గాదు గదా జాతిభేదము. నేను జాబితాగా సరకులకు సున్న వెలలు వేసి, మొత్తము చేసి, త్వరలో మీపని యగునట్లు చేసెదను. పిమ్మట కావలసినప్పుడు కలసికొని యెదను. సరకులను తరలించునప్పుడే తమరు ఎఱుఁగవచ్చును.

సు.—[జనాంతికము] ఆహా ఏమి దురదృష్టం మాకీ, మీరు లేకుండా ఖానాగోష్ఠి చెయ్యడం! యేమీ చేస్తాం! తమచిత్తం. [వలీతో జనాంతికము] ఇది చాలా మంచిదే అయింది. [వర్తకులతో తురకలు నిష్క్రమింతురు.

వెఱ్ఱి.—నాకొక ఆటవిడుపుపద్యం జ్ఞాపకం వస్తావుంది.

(మణిహారము.)

1క్షత్రియుం 2డారయునుఁ గలసియ యున్నన్ గ నకట 3రిపువుల నణఁకఁగఁ దరమె?
క్షత్రియుం డారయును గలయక యున్నన్ గ నకట రిపువుల నణఁకఁగ దరమా.
మొత్తముగ 4హిమము మొనయుంచు నున్నన్ ముదముగ 5మధుపముఁ 6బికము పిలుచునే?
మొత్తముగ హిమము నణఁగిన వెన్కన్ ముదముగ మధుపముఁ బికము పిలుచుఁబో.

---

1. యుగంధరుఁడు. 2. ప్రతాపరుద్రుఁడు. 3. శత్రువులను. 4. తురకలు. 5. యుగంధరుని. 6. ప్రతాపరుద్రుఁడు.

'ఫ్రలాఫ్' అంటేగదా కనుక్కొన్నారు. ఓరి నాయనోయి, నుక్కొన్నార్రో!' అంటేగదా యిద్దర్నీ పట్టుకొని కన్నిసారు. నెల పొడిస్తే సముద్రం పొంగకుండావుంటుందా? తెగ్గాలిస్తే యినుమైనా మెత్తబడకుంటుందా? సంగీతానికే చాపరాళ్లు కరుగుతా యట, మిడియెండకు మంచుగడ్డ కరగదా? నిద్రలో కాకినిగుడ్లగూబ కొడుతుంది. పట్టపగలు గుడ్లగూబను కాకి కొడుతుంది, నీళ్లలో మొసలి ఏనుగను పడుతుంది. నేలను మొసలిని కుక్క కరుస్తుంది. సమయంలేదా, స్థానంలేదా? వెధవలందఱు నామాటలు వెర్రిమాట లంటారు. నేనున్ను కొంతసేపు మౌనం వహిస్తాను.

రాజు.—[ఆత్మగతము] విశ్రమించి పిమ్మటఁ గలసికొమ్మని గురువరు నాజ్ఞ. అట్లే చేసెదను. [అని నిష్క్రమించును.

వెట్టి.—[ఆత్మగతము] అప్పుడే క్రిందితట్టున తురకలు వచ్చి వినోదించుచున్నారు. అచటికేపోయి ఢిల్లీనగరరాజునియొక్క వజీరుప్రాణనాధుకములను బరణితెఱచి నలిపి వేసెదనుగాక. [అని పరిక్రమించును.

స్థలము. 5. ఆ యోడయే, లోతట్టు.

[అంతట పడవకడుపులో తురకలందఱు ఉచితాసనముల నుపవిష్టులై ప్రవేశింతురు. బొమ్మలు తాంబూలము లిచ్చి హుక్కాలు పెట్టును, వీచోపులు వేయును.

సు.—[కైపుతో] వర్తకులూ, వాడలు మీవి కొంటాం మేము. ఇంత అద్భుతం వాడలు, ఈదేశంలో చెయ్యలేరు మేము సుల్తాన్ వున్నాం, నీటి మహల్ మే వున్నాం. ఈయేరు ఖందకం వుంది.

వర్త.—[ఆత్మగతము] వీనికి కైపెక్కుచున్నది. [ప్రకాశము] జగత్ప్రభువు చిత్తము.

సు.—అచ్ఛా! అచ్ఛా! [అని విశేషముగా నవ్వి, ఆత్మగతము] కైపుగా తోస్తుంది! [జాగ్రత్తతో] వర్తకులూ, నిన్నటి నాచిరంగు ఏదీ? అప్పట్నుంచి అక్కడ ఆడుతూనే వుందా? [ఆత్మగతము] కైఫ్ ఎక్వా అవుతూవుంది. నాచిరంగు అప్పుడే మత్రిభ్ అయింది. ఆడుతూవుందా అడుగుతాం.

ఒకవజీర్.—బందగానె అలీ, ఏమి యీ - యీ - యీ - దాని పేరు- రాలేదు, ఆ! యీ విందు!

సు.—మనము బ్రతికి లేము. చచ్చి వీకస్వర్గం వున్నాము నేము చెప్తాం. ఈ సౌదాగర్ల దందా హాశ్చర్యం, అద్భుతం, తమాషా, చమత్కారం, గమ్మత్, వుంది.

మఱియొక వజీర్.—ఆహా ఏమి ఆష్కెబత్ !

,, ఏమి ఆ మాజూమ్! ఏమి ఆ లాహిరి! ఏమి యా మాధుర్యం!

సు.—సేట్ భాయి. పక్షాన్లదు, యెప్పుడో జ్ఞాపకం లేదు, మేము యిలాగే వాడాలో పఖ్ నాచీ చూచినాం. అది మాకి యిప్పుడు, తెచ్చిం పండి భాయి.

మఱియొక వజీర్.—మేము పక్షాన్లదు. స్వప్నంలో యిట్వంటివాడామే పక్షానాచీ చూచినాం షుల్తాన్వారితోకూడా. [వికటముగా నవ్వుచు] వారికీ తోకా వుండుతుంది వోయి? మానోటా చమత్కారంమాటా వచ్చింది ! హిహిహిహి! ఆనాచీ మేము చూడవాలా; తెచ్చించండి, సేట్ వర్తకులు గోవా భాయి.

సు.—ఆనాచీ వస్తే మేము కూడా ఆడుతాం, లేదు మొగతాం, లేదు, వజీర్ భాయి, యేమి చెప్పినాం? ఆడుతాం తోస్తుంది.

వర్త.—[ఆత్మగతము] వీరెక్కడ మన్నారో వీరికి తెలియదు. వలీఖాను పక్షము వారుమాత్రము కైపు లేకున్నారు. [ప్రకాశము] జగత్ప్రభూ, చూచి నదే చూడనేల? జగత్ప్రభువువారు తెలుఁగుదేశము జయించిన కీర్తినాటకమును చూడవచ్చును.

సు.—మాకీర్తినాకటం ! మాకీర్తి నాకటం!

వర్త.—అవును. తమకీర్తినాటకమే. గానిని మాదేశపుమహాకవులు తమకోసము చేసినారు.

సు.—వజీర్సాహేబ్, బలేతమాష్! బలేతమాష్! నాటక మారంభించండి.

వ ర్త.—మా యుద్యోగస్థులు, నౌకర్లు అందఱు చూచుటకు జగత్ప్రభువువారి సెలవును ప్రార్థించుచున్నారు.

సు.—లోకమంతా చూడవచ్చును. వాహావాహా! షూర్యచంద్రుల్ కళ్లాతో పగల్ సాహేబ్ చూడవచ్చును. నచ్ఛత్రాల్ కణ్ణాతో రాత్రి బిబీ చూడవచ్చును! జంగల్ మే వుండే సింగ్ పులి కూడా చూడవచ్చును. హోయి హోయి హోయి హోయి. సముద్రంలో వుండే మచ్ఛం కన్నా ముయ్యాక చూడవచ్చునూ.

ఒకవజీర్.—[అరగన్నువడుచు] హాకాశంలోవుండే పచ్చీకూడా చూడవచ్చునూ.

వలీ.—[ఆత్మగతము] బలే యమధర్మరాజువహోయం! అతిషులభంగా వీళ్లనందరని సాఫ్ శీదా చేయవచ్చును.

వర్త.—మహానుగ్రహము! మహానుగ్రహము! ఆటగాండ్రను తెచ్చెదము.

[అని నిష్క్రమింతురు.

సు.—[తాంబూలకరండవాహినినిగూర్చి] మాకీ యేలడా యేలడా యేలడాయిలో వచ్చినందుకు చచ్చినావు అగె పసారీ?

[అని దానిచేయి పట్టుకొనును.

తాంబూ.—ఆహారీ పేరు మహాప్రభూ.

సు.—ఆహారీని మేము చూడవాలా. బలే! బలే! బలే!

వలీ.—మనము ఎన్నిలడాయిలలో చస్తాం సర్కార్?

సు.—ఆహా! మీరుకూడా నాతో యిక్కడ వున్నారా! మీరు యెప్పుడు చచ్చినారు సాహేబ్?

వెట్టి.—[సమీపించి] ఇప్పుడే. ఇప్పుడే.

సు.—ఆహో! దివానాబహద్దర్! దివానాబహద్దర్! మాదగ్గిర మాదగ్గిర. [అని తనప్రక్కను తనకు వలీఖానునకు నడుమ గూర్చుండఁ బెట్టుకొని] దివానాబహద్దర్భాయి పశాశికి మేము చూడవాలా.

[వెఱ్ఱివాఁడు తన ప్రమిదను చూపును. ఆఁడలు వికృతముఁగా నవ్వుదురు.

అంతట వలీపాత్రము సిపాయీలును ప్రవేశింతురు.

వలీపాత్రము.—బలే! బలే! సర్వం సిద్ధమా?

సిపా.—సర్వం సిద్ధం.

వలీపా.—మరి కదలండి. [ప్రయాణభేరి, ఇతరవాద్యములును.

వలీపా.—మీరు ఈలడాయిలో యే మేమిస్తే చూస్తారు చెప్పండి.

సిపా.—[ఒకరితో నొకరు] మనము గులాంద స్తఖైరునిషీచేత కట్టించు కొన్న పాటా కానిత్తాముఁరా. [అని సవాద్యముగా పాడుదురు.

ఒక సిపా.—[ఆలోస్యన చేయి యుంచుకొని] సర్దార్, నేను,

మొఘలి ధోం కలోన దొఘిరే నా ఘసాామి

రఘులే యి సము దాగే పఘిడీమియా.

[కడమ సిపాయిపాత్రములు వెంటఁ బాడుదురు.

మఱియొకఁడు.—[అట్లే] నేను సర్దార్,

నీ రంతా పారాయి నాఁరంతా ఘుంజాయి

జారీ నిషా లేని పీరూ మిఠూ. ,,

ఇంకొకఁడు.—[అట్లే] నేను సర్దార్,

హాఖాపా నా ఫట్టి లేఖాన్కి హారొాల

ఢీఖోనీ యే షేటి షేఖూ మిఠూ. ,,

[సిపాయీలందఱు కలిసి పాడుదురు.

* పీఖాల కీ కోసి హాఖాసానీ కేసి

రాఖాసు లూ రండి కేఖాలేస్తాం.

యెళ్లన్ని కోశేశి నాళ్లన్ని దోశేశి

ఊళ్లన్ని బల్వల్ల కాళ్లు శేస్తాం.

యేగ్గాల కొమ్మట్టి పీగ్గాలు గా గొట్టి

* పీఖాలకీ=గొంతు పీఁకెలను.

గాన్గపెంటలుగా తున్గి యేస్తాం.
సాయూల శెవు లట్టి నాయూలు వాకేసి
సీమాలు పోగొట్టి నామాజ్ శేస్తాం.
అన్యూల ముక్కట్టి రొయ్యాలు దిన్పించి
సయ్యద్ సాహెబ్ చేస సాఫు చేస్తాం.
నిక్కాగు బ్బైతల తక్కాలు సళ్లించి
అక్కాడి కక్కాడే నిక్షా శేస్తాం.
రానీవా సాయూలా మానామగా దెచ్చి
కానీక సర్దార్ జై నానా కస్తాం.

సు.—వహ్హావ్వా! వహ్హావ్వా! [వర్తకులతో] ఈవస్తాదులు కూడా బొమ్మల్ చెయ్యలేక పోయినారా వర్తకులూ?

వర్త.—జగత్ప్రభూ, రసజ్ఞశేఖరా, ఈవస్తాదు లందఱు బొమ్మలే.

సు.—[పట్టి చూచి ఆశ్చర్యముతో ముక్కుమీఁద వ్రేలుంచుకొని] వర్తకులూ, మీది సర్వం మోసంవుంది. ఏమిహాశ్చర్యం! ఏమిహాశ్చర్యం! మీరు యీలోకం వర్తకులుగారు. ఏలోకం వర్తకులు?

వెఱ్ఱి.—యమలోకం వర్తకులు. వెంగళప్పా, తెలివితక్కువ ప్రశ్నలు వేస్తావు?

వస్తాదులు, వర్తకులు.—[నవ్వుచు] దివానాబహద్దర్, నీవే ప్రళయకాలుఁడవు, మేమే కింకరులము.

వెఱ్ఱి.—అయితే మాకాయస్థుఁడు చిత్రగుప్తుఁడేఁడి?

వర్త.—చచ్చినవారిని యమునియెదుట మాటలాడ సిద్ధపఱుచుచున్నాఁడు.

వలీఖా.—[ఆత్మగతము] ఈఢిల్లీయేలకపోతే నేనుపఠాన్ కాను. తెలంగీ దేశం కొడ్తే రాజువకీ లూటీ విస్తారంపస్తుంది, అది నాకీ వశం వుంటుంది. ఈలడాయిలో ఖుస్రూ చస్తే సంతోషం. బతికితే తర్వాత సఫాయి.

సు.—[వలీఖానుంజూచి] ఇదేమోయి యిది? యిట్వంటి ఆలోచన వుందా నీకి?

వలీఖాన్.—బందగాని అలీ, ఇదంతా అబ్ధం, జూటా, వుత్తనాటకం.

సు.—అవును వుత్తనాకటమే. కానీ చూస్తాం యింకా.

[ప్రవేశవాద్యములు మ్రోగును.

వలీపా.—మనం యిప్పుడు వోరంగోల్ చేరినాంగదా. యీపండు పట్నం కట్టడానికి ఖుస్రూతో ఛోడ్దేవు చేశి రాజాకి కట్టడాన్కి జంగల్కు పోదాం.

సిపా.—సర్దార్గ్నిత్తం. [ప్రయాణభేరి, ఇతర వాద్యములును.

సు.—అహో! వలీఖాన్. లడాయిలో రాజాకి పట్టినాన్ చెప్పినావే?

వలీఖాన్.—ఇదంతా జూటానాటకం సర్కార్.

సు.—మంచిది, నాకటమే, చూస్తాం యింకా.

వలీపా—మరి నడవండి. [అందఱు సవాద్యవాదనముగా పరిక్రమింతురు.

వలీపా.—అడ్వీకి వచ్చినాం రాజాకి వెత్కండి.

[సిపాయీలు చెదరి అన్వేషణ మభినయించుచు నిష్క్రమింతురు.

వలీపా.—రాజా నాకిదొరికితే ఢిల్లీకి తీస్కొనిపోతాన్. ఖుస్రూ ఇక్కడే చావనీ.

సు.—[వలీఖానుతో] అరేయే మిరా నీకీ ఖుస్రూఖాన్ మీద అంతా ఖావేషి?

వలీఖాన్.—తమరు కైఫ్ మే వున్నారు, తమకీ యిదీ అదీ తెలియడం లేదు. అరే నట్టువ్రులు, యేమి నాట్కం యిది, జూటానాట్కం ఆడ్తారు? మాకీ సుల్తాన్వారికి ద్వేషం చేస్తారూ?.

సు.—[కోపముతో] అరే! యేమిరా యింతా జబర్దస్తీ మాట్లాడ్తావ్?

వలీఖాన్.—లేదు అల్లా. నట్వులతో మాట్లాడినాను. గులాంతల మీది.

సిపా.—[రాజాను పట్టితెచ్చి] సర్దార్సాహెబ్. ఇద్గో రాజా మీ ఖాయిదీ.

వలీపా.—ఆహా! రాజాకి పట్టినాను గదా!

శెట్టి.—నాకొక వెంగళప్ప ఒకపాటకట్టి నేర్పాడు. ఇది చూడకపోతే అది వినండేమి. [అని లేచి ఆడుచు పాడును.

రాజు నేమో పట్టలేదు, రౌతు నేమో పట్టలేదు,

చాకలిపే రని వల్లీ సాయెబయ్య పట్టినాడు.

మంత్రిమాటకు మోసపోయి మంచిదుస్తు నగలు దొడిగి

వేట వేసము వేసుకొని కాటిమొసలో గునుకుచున్న

చాకలిపే రని వల్లీ సాయెబయ్య పట్టినాడు.

రాజు నేమో పట్టలేదు రౌతు నేమో పట్టలేదు, చాకలి...

సు.—[ఆత్మగతము] ఆహాహాహా! ఎంతమోసం! ఎంతమోసం! [ప్రకాశము] అరే వలీ యేమిరా మహాల్వాలాకి మా చేత తాజీం యిచ్చినావు.

వలీఖాన్.—దివానాది పాటా నమ్ముతారూ. నాదీమాట నమ్మరు.

సు.—కానీ కానీ. అరే వర్తకులు, ఏమి మాకీ మోసం నాకటం చేస్తారు? మీకీ తల్కాయ అక్కర్లేదా?

పెద్దసెట్టి.—తలకాయ అక్కఱ లేదా? తలకాయకోసమే యింతగోలువు. జగత్ప్రభూ, మేము, తమదర్శనమునకు వచ్చి మూడుమాసము లయినవి, వచ్చిననాఁడే యీయోడకు లంగరు దింపి కొంచెనువలికి జరుగుటకు మరల లంగరెత్తఁగా లంగరుతో ఒకశవము మొండెము రాయి కట్టినది లేచినది.

సు.—తర్వాత? తర్వాత?

వలీఖాన్.—[వర్తకులను సుల్తానును అత్యుగ్రముగాఁ జూచుచు, ఆత్మగతము] యమధర్మరాజువహాయం మోసం వుందా? వచ్చినపని జర్గడాన్కి జగడం పెడ్తారు తోస్తుంది.

పెద్దసెట్టి.—అంతట ఎవరో పాపము, ఎవరో చంపినారు, బంధువులు వెదకుకొనివచ్చిన ఈయవచ్చును, అని ఆశవమును ఓడలో పెట్టితిమి. గట్టున

సు.—[వలీఖానుంజూచి] ఇదేమోయి యిది? యిట్వంటి ఆలోచన వుందా నీకి?

వలీఖాన్.—బందగాన ఆలీ, ఇదంతా అబ్ధం, జూటా, వుత్తనాటకం.

సు.—అవును వుత్తనాకటమే. కానీ చూస్తాం యింకా.

[ప్రవేశవాద్యములు మ్రోగును.

వలీపా.—మనం యిప్పుడు వోరంగోల్ చేరినాంగదా. యీదండు పట్నం కట్టడానికి ఖుస్రూతో ఖోద్దేవు చేశి రాజాకి పట్టడాన్కి జంగల్కి పోదాం.

సిపా.—సర్దార్నిత్తం. [ప్రయాణభేరి, ఇతర వాద్యములును.

సు.—అహో! వలీఖాన్. లడాయిలో రాజాకి పట్టినాన్ చెప్పినావే?

వలీఖాన్.—ఇదంతా జూటానాటకం సర్కార్.

సు.—మంచిది, నాకటమే, చూస్తాం యింకా.

వలీపా—మరి నడవండి. [అందఱు సవాద్యవాదనముగా పరిక్రమింతురు.

వలీపా.—అడ్వీకి వచ్చినాం రాజాకి వెత్కండి.

[సిపాయీలు చెదరి అన్వేషణ మభినయించుచు నిష్క్రమింతురు.

వలీపా.—రాజా నాకీదొరికితే ఢిల్లీకి తీస్కానిపోతాన్. ఖుస్రూ ఇక్కడ్ చావనీ.

సు.—[వలీఖానుతో] అరేయే మిరా నీకీ ఖుస్రూఖాన్ మీద అంతా ఖావేషి?

వలీఖాన్.—తమరు కైఫ్మే వున్నారు, తమకీ యిదీ అదీ తెలియడం లేదు. అరే నట్టువులు, యేమి నాట్కం యిది, జూటానాట్కం అడ్తారు? మాకీ సుల్తాన్వారికి ద్వేషం చేస్తారూ?.

సు.—[కోపముతో] అరే! యేమిరా యింతా జబర్దస్తీ మాట్లాడ్తావ్?

వలీఖాన్.—లేదు అల్లా. నట్వులతో మాట్లాడినాను. గులాంతల మీది.

సిపా.—[రాజును పట్టితెచ్చి] సర్దార్సాహేబ్. ఇద్గో రాజా మీ ఖయిదీ.

వలీపా.—ఆహా! రాజాకి పట్టినాను గదా!

శెట్టి.—నాకొక వెంగళప్ప ఒకపాటకట్టి నేర్పాడు. ఇది చూడకపోతే అది వినండేమి. [అని లేచి ఆడుచు పాడును.

రాజు నేమో పట్టలేదు, రౌతు నేమో పట్టలేదు,
చాకలిపే రని వల్లీ సాయెబయ్యా పట్టినాడు.
మంత్రిమాటకు మోసపోయి మంచిదుస్తు నగలు దోడిగి
వేట వేసము వేసుకొని కాటిమొసలో గునుకుచున్న
చాకలిపే రని వల్లీ సాయెబయ్యా పట్టినాడు.
రాజు నేమో పట్టలేదు రౌతు నేమో పట్టలేదు, చాకలి...

సు.—[ఆత్మగతము] ఆహాహాహా! ఎంతమోసం! ఎంతమోసం! [ప్రకాశము] అరే వలీ యేమిరా మసాల్వాలాకి మాచేత తాజీం యిచ్చినావు.

వలీఖాన్.—దివానాది పాటా నమ్ముతారూ, నాదీమాట నమ్మరు.

సు.—కానీ కానీ. అరే వర్తకులు, ఏమి మాకీ మోసం నాకటం చేస్తారు? మీకీ తల్కాయ అక్కల్లేదా?

పెద్దసెట్టి.—తలకాయ అక్కల లేదా? తలకాయకోసమే యింతగోలవు. జగత్ప్రభూ, మేము, తమదర్శనమునకు వచ్చి మూఁడుమాసము లయినవి, వచ్చిననాఁడే యీయోడకు లంగరు దింపి కొంచెమువలికి జరుగుటకు మరల లంగరెత్తఁగా లంగరుకో ఒకశవము మొండెము రాయి కట్టినది లేచినది.

సు.—తర్వాత? తర్వాత?

వలీఖాన్.—[వర్తకులను సుల్తానును అత్యుగ్రముగాఁ జూచుచు, ఆత్మగతము] యమధర్మరాజుమహాయం మోసం వుందా? వచ్చినపని జర్గ డాన్కి జగడం పెడ్తారు తోస్తుంది.

పెద్దసెట్టి.—అంతట ఎవరో పాపము, ఎవరో చంపినారు, బంధువులు వెదకుకొనివచ్చిన ఈయవచ్చును, అని ఆశవమును ఓడలో పెట్టితిమి. గట్టున

నక్కలుఁ గాంచి పోయి చూడఁగా తల యొకటి దొరకినది. అది ఈ మొండెమునకు సరిపోయినది.

సు.—తర్వాత? తర్వాత?

[వలీఖాను తన పక్షమువజీర్లకు హెచ్చరిక సేయును.

పెద్దసెట్టి.—అంతట పేటుబంది చేసి ఔషధములచే ఆశవమును ఈ గదిలో కాపాడియున్నాము. మఱిమా గ్రహాచారముచే శవమువెంటనే చచ్చిన వాని పిశాచము కూడ ఆగదిలోఁ జేరినది. రాత్రుల్లెల్ల అంమలో కో యని యేడ్పులు. ఎండలకో మాకళాసులకు అభయముచే జ్వరములు. ఎందఱనో ఆపిశాచము పట్టి మాపౌరోహితులు ధూపము వేసిన పలుకుచు, తాను ఖుస్రూఖాన్—

సు.—[ఆశ్చర్యముతో] ఆ! ఆ! ఆ! ఏమి? ఏమి?

[వలీఖాను కత్తి దూయును, అతనిపక్షము వారును దూయుదురు.

పెద్దసెట్టి.—[వణఁకుచు] తన్ను వలీఖాన్ చంపినాఁడని, సుల్తాను వారితో చెప్పుమని యేడ్చును. తమతో చెప్పినతర్వాత దానిని పోఁగొట్టుకొంద మని యింతకాలము ఇంత కష్టపడినారము.

[వలీఖాను సుల్తానును పొడువఁబోవును. వెల్లి. వలీకత్తిని లాగివేసి వాని పెడ రెక్కలు విఱిచికట్టును. సిపాయిప్రాతములు వలీఖానుమిత్రులను అట్లే చేయుదురు.

సు.—అరే! యీహాశ్చర్యాలలో మాకైపుగయా, అంతా పట్టపగల్లా వుంది! అరే! అరే! జూటానాకటం చెప్పినావు! యెంతాద్రోఘీరా నీవు! నీవు మాకీ కొమార్తెకీ యిచ్చి పెళ్లి చేస్తావు! విందూ చెప్పి యింటికి లేస్కానిపోయి చంపడానికి, నిశ్చయం! అహో హాశ్చరం! ఎంతాద్రోఘీ! ఎంతా ద్రోఘి? మాకి చంపే యీపాపి మాఖుస్రూకీ చంపినాడులో సందేఘం యేమి? అరే ఖుస్రూ! అరే ఖుస్రూ! అయ్యో ఖుస్రూ! వాడు మాబిడ్డా, వాడు మాకూనా, వాడు మర్గయా, మేమూ మర్గయా.

[అంతట గదినుండి ఖుస్రూశవము పిశాచాధిష్ఠితమై వచ్చును. ప్రేక్షకులు గడగడ వణఁకుదురు. వజీర్లు భయవిభ్రాంతులై దూరము జరుగుదురు, అట్లే సుల్తాను వడవడ వణఁకును.

సు.—[భీతినాటితకముతో] మూడుమాసం ఖానా లేక సొక్కిన దవడలు, చిక్కినశవం, ఎండుతాటికాయలాగ తల్కాయ, ఎండుతాటిబొంద లాగ మొండెం. వీటికే చూస్తే మాకీ గుండె తుద్వాని పోతుంది! గాభరా వుంది! క్యాకర్నా!

ఖుస్రూ.—[పెద్దరోదనముతో] మెరే బాబ్, ఘయాజ్ ఉద్దీన్ టోగ్లాక్ సుల్తాన్, బందగానె అలీ, నాకీ వలీ చంపినాడు. లడాయిలో చావలేదు. బిసాత్ ప్రాణం దొంగాచేతా చచ్చింది. వీడు రాజాకి పట్ట లేదు. చాకలికి పట్టినాడు. [సుల్తాన్ విభ్రాంతుఁడై వినును.

వెట్టి.—[వలీఖానును తన్ని దొరలించుచు] 'దివానాది పాటా నమ్ముతారు, నాది మాటా నమ్మరు.' [వలి వణఁకును.

ఖుస్రూ.—రాజా తర్వాత వచ్చినాడు. లడాయి ఏంది, మన దండంతా మర్గయా. నేను మెరే బాబ్, మెరే బాబ్, మెరే బాబ్, తమ పాదాల్ దర్శణంకోసం, పరారిచేసి ఢిల్లీకి వచ్చినాను.

[సు. వణఁకుచు ఏడ్చును. సుల్తాన్ పక్షము వజీర్లును వణఁకుచు ఏడ్తురు. వలీ. కన్నులు మూసికొనును.

ఖుస్రూ.—వీడు సర్దార్గదా అని, వీడు సర్దార్గదా అని, వీడికి దర్శణం చేసి, నీవుచాకలికి తెచ్చినావు చెప్పినాను బాబ్, తమతో చెప్పవద్దు అన్నాడ్. తప్పకుండా నేనుచెప్తాన్ అన్నాను. అయితే పోని సికార్పోదాం చెప్పి, కబుర్లుడుగుతూ, ఇక్కడక్కవచ్చి అద్గో అక్కచూడు చెప్పి యిట్గో యిక్డ నాతల కొట్టినాడ్ బాబ్, మెరేబాబ్. [వలీ. మూర్ఛిల్లును.

ఖుస్రూ.—వాడ్కి అట్లా వీరు తల్కాయ కొట్టించి నాకి గోరీ కట్టిస్తే నావాత్మ హల్లాకాడికి పోతుంది.

సు.—[కన్నీళ్లతో వణఁకుచు] యిప్డే వాడ్కి శాస్త్రీ చేస్తాం. నీకి బంగారం గోరీ కడ్తాం. ఏడవకు హాల్లా కాడ్కి పో. అహాహా, మూడుమాసా ల్కింద దివానాగోడ్ గ స్తీజవాన్లు వీడికి చూచినాం చెప్పినార్. ఈవలీ పాపి జూటాభాత్ అన్నాడ్. మాకీ యుద్ధంలో ఖుస్రూ మగ్గయా చెప్పినాడ్.

[వలీఖాన్ మూర్ఛ తేరును.

ఖుస్రూ.—మేరేబాబ్కి సలామతీ. వేనీదేఘం తమకివప్పగించి అల్లా కాడ్కి పోతాఁవున్నాను.

[ఖుస్రూ కళేబరమునుండి చెకుముకిశాస్త్రి వెలువడి కళేబరమును

త్రోసి వలీకిమాత్ర మగపడి చాటునకు పోవును.

వలీఖాన్.—[చెకుముకిశాస్త్రిం గని] హా! హా! హా! యంఘర్మరాజా

[అందఱు కళేబరమును దరిసి కని ఆశ్చర్యపడుదురు.

షెట్టి.—నన్ను పిలుస్తావా?

సు.—అరే గాడిదా, యమధర్మ రాజేమిరా?

పెద్దసెట్టి.—[వణఁకుచు] చావఁబోవువానికి, ఇది హిందూనావ గనుక యమధర్మరాం జగడినాఁడు.

సు.—వీఁడ్కి మేము యంఘర్మరాజ్ అవుతాం.

మాదీ నమ్మఖిన్న మంచి పకీర్లకి
మాపై ఖాహేషీ చేస్తాడు.
మాషాల్ వాలాగాడ్కి మాకీ తాజీం చెప్పి
మాకి వావ్మాసం చేస్తాడు.
మాగులాం కు నంపి మాకీ నఫాయి చేసి
మాళ్ళు వీడు గొబ్తాడు.
హిద్దిద్గో వీడికి హిందారు చూడండి
నేటాపో తూ హాల్లా కేస్తాన్.
వేడి వేడి వేడి వీడినెత్తు ర్తాక
వీళ్ల మొ ఘూన ఘూ చేస్తాన్.

వీళ్ల డొక్కల్ చించి వీళ్ల పే గుత్తెంచి
వీళ్లకే బొమ్మన్నాడు వేస్తాణ్.
నిప్పు కం పాలతో నెత్తి యుడ్గొ ల్దాక
నిత్యం వీ క్లెమ్కల్ కోయిస్తాణ్.
భగ్భగ్భ గ్నిప్పులో వదియేళ్లు రోజ్రోజు
పాతి మ హాప్మాయ్ చేయిస్తాణ్.

[అని వలీఖానుతలను కొట్టఁబోవును.

పెద్దసెట్టి.—కట్టినవానిని తమరుకొట్టఁగూడదు, అంగరక్షకుల కాజ్ఞ చేయుఁడు.

వజీర్లు.—అవును. బందగానె అలీ, మేను చెప్తాం. ఎవర్రా, అక్డ? ఈపాపాత్ములకి తీస్కానిపోయి కలకొట్టి గాయిగట్టి జమ్నామే వెయ్యండి. అది సర్కార్ ఆజ్ఞ.

అంగరక్షకులు.—సర్కార్ చిత్తం. [అని కొనిపోవుదురు.

పెద్దసెట్టి.—[ఒకవర్తకునితో అపవారించి] వలీతల తెచ్చి భద్రము చేయుము.

[ఆ వర్తకుఁడు సిప్కా]. గుభీల్ గుభీల్ అని నీటిలో వేసిన శబ్దములు అగును. గుండ్లు మ్రోఁగును.

అంతట చెకుముకిశాస్త్రి ప్రవేశించును.

వర్త.—వీరే మాపురోహితులు.

సు.—ఓహో చిత్తర్ గుప్తజోస్యులు!

[చెకుముకి వలీఖానుని ఖరారునామా సుల్తానుచేత పెట్టును.

సు.—[చదువుకొని] అహో! మాకి యీ రాత్రి చంపడానికి మూడు నెలల్ కుట్ర. ఇది వాడిదే దస్తూరీ. ఇది వాడిదే దస్కత్. ఇవి వా డెవర్కి రాసినాడ్ ?

చెకు.—ఎవరిదో? ఈ చీటి ఒకనాఁడు జగత్ప్రభువువారి యాస్థానమున సభ లేచినపిమ్మట నాకు దొరకినది. ఆశత్రువు లందఱు తమకు దొరకుటకై, ఇప్పటివఱకు నేను దీనిని దాఁచితిని. ఈపత్త్రికలను ఈకుట్ర తెలిసితిని. వాని యింట జగత్ప్రభువునకు విందు తప్పించి వారివిషయమున తమకు చేసిననౌకరీ తమకు ప్రత్యక్షమే.

సు.—వారిచేత బతికినాం. మీ వుప్కారానికి చాలా సంతోషం! హా యేమి రాత్రియిది! వీణ్ణి మేం సిఫాయిమొదల్ ఫౌజ్‌దార్ చేశి, సర్వసేనాపతి చేసి, ధనం ఇచ్చి మర్యాదల్ ఇచ్చి, వజీర్ చేసి, మొదల్‌వజీరు చేసినాం. మాకీ యింతా ద్రోహం చేసినాడు! హా హా హా!

[నేపథ్యమున బాలస్వరముగా]

దాదాజీ, దాదాజీ, నీహుకుం చెప్పి వీళ్లు నాకీ
చం పేస్తున్నారు! దాదాజీ, దాదాజీ! దాదా ఆ ఆ ఆ.

సు.—హా! నా హస్నాకోమాఁడుడి యేడ్పు విన్పడ్తుంది! ఆ! నాపాపం నాకిక్కొట్టిందా! హా! హా! హల్లా! హల్లా! [అని మూర్ఛితుఁడై పడిపోవును.

వజీర్రు.—[వణఁకుచు చెమర్చుచు] హా యేమిరాత్రి యిది! ఏమి రాత్రి యిది! అయ్యో! పెద్దపిసాసీ సహ్వాసంలో నోర్లేని కూనపిసాసీ చేరింది! వీడు వలీఖాన్కు పెంచినాడు; దాన్కి బదులు వీణ్ణి వీడి అన్నా పెంచినాడు. అతడు, సచ్చేతప్పుడు, మాకళ్లు చూస్తావున్నపి, యీపాపాత్ముడివల్లో పెట్టి పోయిన నోరెరగని కూనకి ఏడేళ్ల సిషువ్కి, వీడు గోడచాటు వుండి చూస్తా వుండి, [కన్నీళ్లతో ఏడ్చుచు] కల్చుకొంటు మాగుండెల్ నీరవుతుంది, ఆ మహా ప్రభు సిషువ్కి, వీడు యిద్దర్ మనుషుల్ చేత, ఇతనికి పిలిచిపిలిచి యేడుస్తా వున్న సిషువ్కీ, సంపించి వేసి తళ్లు యెక్కినాడు. ఆపాపం యిప్పుడు వీడి గుండెకి తగిలింది సౌదాగర్ భాయి.

పెద్దసెట్టి.—శివశివా! శివశివా!

[చెకుముకి సుల్తానుముఖమున కన్నీరు చల్లును. సుల్తాను ఆశ్వాసిల్లును.

వజీర్లు.—బందగానె ఆలీ, ఇక యిక్కడ మనం వుంటాంవద్దు. నగర్కు పోదాంరండి.

సు.—నగర్నుంచి గుండు మాగుండెకి యిప్డు తగిలింది. మేము యిప్డు నగర్కు రాలేము.

చెరు.—మఱియుఁ చటనే శయనింపుఁడు, సర్వము సిద్ధము. నాతో రండు. కొంచెము షర్బత్తు పుచ్చుకొనుఁడు, ఆయాసము తీఱును.

వజీర్లు.—అట్లా చేయండి.

[చెఱుముకి షర్బత్తు ఇచ్చును. సుల్తానుత్రాగును. వజీర్లును చెఱుముకియుం సుల్తానును శయనగృహమునకు తోడ్కొని నిష్క్రమింతురు.]

అంతట రాజు ప్రవేశించును

వెట్టి.—పెద్దసెట్టీ, మహారాజునకు మంగళవేష మొసంగుము.

పెద్దసెట్టి.—శుభము శుభము శుభము. తమరును మంగళవేషము ధరింపుఁడు.

[అని వెట్టివానికి మంత్రి వస్త్రములు ఇచ్చి, రాజునకు వస్త్రములను ఆభరణములను తెచ్చి యుంచును. వెట్టివాఁడు మహామంత్రి వేషము ధరించును.

పెద్దసెట్టి.—జయము జయము మహామంత్రి యౌగంధరులవారికి.

చెఱు.—[ప్రవేశించి యౌగంధరునింగని] జయము జయము యశోధర్మ రాజ మహామంత్రి గారికి. [రాజుంగని] ఈయమసభలో సౌదాగరులవారు దేనికి వెలలు వేయుచున్నారు? [అగాదు. యౌగం. తల ఆడించును.

రాజు.—[రాజవేషధారణమును ముగించుచు] వెల గలవానికి వేయఁ గలమేగాని లేనివానికి వేయఁగలమా?

చెఱు.—వెలలేని సరకులుం గలవా యీవర్తకులయొద్ద?

[అగాదు. యౌగం. తల ఆడించును.

రాజు.—[ముగించి తటాలున యౌగంధరునిపాదములు పట్టుకొని, హర్షాశ్రుగద్గదముగా] ఈ యౌగంధ్రమునకు వెలగలదా శాస్త్రులవారూ?

ఉ. 1శ్రీదయితుండు 2దానవులఁ 3జెండి నిజాశ్రితు నింద్రుఁ బ్రోచిన
ట్లాదట నా యరాతుల వెలార్చి నను న్సతతంబుఁ బ్రోచుచున్,
4శ్రీదునిఁ జేయఁ బేద నలశ్రీదు నొనర్చి విధి న్హసించు నీ
పాదసరోరుహద్వయికిఁ బ్రాజ్ఞవరేణ్య, వచింపు మూల్యమున్. 6

[అని యాపాదములను బాష్పములం దడుపును.

అందఱు.—లేదు, లేదు, లేదు. [మూఁడు అగాదులు.

యుగం.—లే లెమ్మా వత్సా. [అని రాజును లేపి కూర్చుండఁబెట్టి] దైవికము తండ్రీ, ఖేదపడకు.

రాజు.—తమ యాజ్ఞ మీఱిన దోషమే, దైవదోషముగాదు.

యుగం.—వత్సా, గతమునకు చింతిల్లకు.

ఉ. రాణ వలిర్ప నీ కఖిలరాజులు దండనతు ల్రచింప, వి
న్నాణపుమౌళికెంపులఘనద్యుతి నల్గడఁ జుట్టుపాఱుచోఁ,
జాణను ని న్వరించు నలశాత్రవలక్ష్మిని బెండ్లియాడఁ బా
రాణియలంకృతిం బడయుం రాజశిఖామణి, నీపదాబ్జముల్. 7

రాజు.—మహాప్రసాదము మహాప్రసాదము.

యుగం.—వత్సా, నీ బాహుకార్యమును వీరి భక్తివిశ్వాసములు కావించినవి.

రాజు.—నా సుకృతకార్యమును గావించినవి.

యుగం.—పెద్దసెట్టీ, బాల్యమున మాసహాధ్యాయివి సహక్రీడివియు నైన స్నేహవిశ్వాసములను పూర్ణముగా చెల్లించితివి.

పెద్దసెట్టి.—కంటికి ఱెప్పలవలె సదా రక్షకుల వగు తమకు నాచేయుం గొలువునకు ప్రశంస యేల?

రాజు.—ఆచంద్రార్కము ప్రశంసనీయము మీయందఱవిశ్వాసము.

1. నారాయణుఁడు. 2. అసురులను. 3. సంహరించి, ఆదటన్: ప్రీతితో. ఆరాతులన్=శత్రువులను. 4. కుబేరుని.

యుగం.—చెకుముకీ, ఇప్పుడీ ఢిల్లీనగర మెట్లయినది?

చెకు.— (పంచచామరము.)

సచిత్రగుప్తకింకరంబు చాయపట్టి చండతన్
విచిత్రవైఖరిన్ 1మెసంగి వీడినట్టు లయ్యెఁ జూ.
2విచేతనంపు మొండియంపు వేగిరింపు లింక ఢి
ల్లిచేష్ట, జ్యేష్ఠలక్ష్మి గౌఁగిలించె దీనిఁ బ్రేమతోన్. 8

యుగం.—ఇక్కడికి లెక్క అప్పగింపుము.

చెకు.—హతశేషులు—సుల్తాను, ఇరువురు ముసలివజీర్లు. ఇరువురు జవానులు. వీరు శాశ్వతనిద్రలో నైదు.

యుగం.—వత్సా, మన సన్నాహమును పరికించుచుంటివా యింతసేపు?

రాజు.—విచారించితిని. ఈ యోధుల నున్న పదివేలుగాక నదిపొడుగునను నాబలము ఏఁబదివే లున్నదిగదా. మనమేల ఢిల్లీని పట్టఁగూడదు?

యుగం.—చచ్చినపాము, పట్టి నిలుపుకొనుట కీసన్నాహము చాలదు.

రాజు.—తమ చిత్తము.

పెద్దసెట్టి.—ఏలినవారు ఒక కొన్నియేని నిజమంగళాలంకారములు ధరింపరాదా?

రాజు.—విశ్వనాథక్షేత్రమున ప్రాయశ్చిత్తమై, విశ్వనాథపూజయై, [యుగంధరుని పాదములు చూపుచు] ఈపాదములను నాస్వహస్తములఁ బూజించి, పిదప.

చెకు.—తురకలు తిండికి లేవఁగానే లంగరు లెత్తినారము. నిద్ర కేఁగినంతనే చాఁప లెత్తినారము. ఉభయవేగములఁ బోవుచున్నవి. అదే విశ్వనాథసేన.

8. సచి...డతన్=చిత్రగుప్తుఁడును కింకరులును తోడుగా యమధర్మరాజు మహాకోపముతో. 1. భక్షించి. 2. ప్రాణము లేని.

యౌగం.—మఱి అందఱు విశ్రమింపుఁడు.

ఆ. సెట్టి యొకఁడు, జీనుఁ, జెఱుకుశాస్త్రియుఁ,
కాలరుద్రుమూఁడుకనులభంగి,
మేము మువ్వురమును మేల్కొని యుందుము,
ప్రభువు విశ్రమంబుఁ బడయుఁగాక.

[అందఱు నిష్క్రమింతురు.

# నవమాంకము.

స్థలము 1, ఓరుఁగల్లు, నగరిలో, రాణి పూజామందిరము.

అంతట విరహకృశ వ్రతస్థరాణి గౌరిని పూజించుచును, చేటిక లుపకరణము లందిచ్చుచును, కొందఱు విప్రాంగనలు, పురోహితుఁడు, తద్భార్య, తత్స్నుషయు, ప్రవేశింతురు.

పురో.—అమ్మా, స్వప్నములో దేవత లిచ్చిన వరములు తప్పవు. ఈ దినమే నీవు ప్రాణేశ్వరునిఁ గలసెదవు.

రాణి.—మహానుభావుల వాక్ప్రభావము.

[అని గౌరిని పాడును, చేటికలు మృదంగాదికము వాయింతురు.

ఖమాజ్ రాగము. చాపుతాళము.

*ఇందుమౌళి కామినీ, మృగేంద్రగామినీ,
డెందమందుఁ గూర్పవే, నా కుందు దీర్పవే. ఇందు.

దుష్టవర్గ శిక్షణీ. శిష్టరక్షణీ,
కష్ట మడఁచి ప్రాణనాథుఁ గనుఁగఁ జూపుమీ. ఇందు.

†కల్పకముల వాడనితపము కన్నెలీలనే,
సల్పి యతని సగము గొన్న సాహసాంగిరో. ఇందు.

కల నొసఁగిన వరము లిపుడె కరుణసేయవే,
‡కులగిరీంద్ర కన్య, జాలి గొనవె, కావవే. ఇందు.

---

*ఇందు—చంద్రశేఖరుని (శివుని) భార్యా, సింహము నెక్కి సంచరించుదానా, (నీ) హృదయమందు (నాపై) ప్రేమ వహింపుము, నాదుఃఖమును పోఁగొట్టుము.

† కల్పకము=సృష్టి మొదలు ప్రళయమువఱకుం గలకాలము.

‡ హిమవంతుని యొక్క.

రాణి.—[దోయిలించి దోయిలించి అమ్మవారి పాదముల పువ్వులు చల్లి] ఓసీ, కాశీ, ముత్తెములగంప అందియ్యవే.

చేటి.—ఇదిగో. [అని దగ్గఱఁ బెట్టును.

[రాణి ముత్తెములు దోయిలించి గౌరి పాదములం దర్పించును.

ఒకచేటి.—[ప్రవేశించి] దేవీ, మల్లీ పువ్వులు, కడవాని అన్నీ వచ్చినవి.

రాణి.—ఏమేవి? ఎంతెంత?

ఆచేటి.—పదిబళ్లు పువ్వులు, నూరుబిందెలు పన్నీరు, నూరుగిండ్లు అత్తరు. ఇంకాచిల్లరలు వున్నవి.

రాణి.—సగము అత్తగారిపూజకు గొనిపొండు, సగము ఇక్కడికి తెండు.

ఆచేటి.—ఇవన్నీ అత్తగారు పంపినవే.

రాణి.—అటయిన మహాప్రసాదము. అంతయుఁ దెండి జాగ్రత్తగా.

ఆచేటి.—దేవిగారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

రాణి.—ఈ పీసులు గౌరీవాగమృతమును గ్రోలిన యాదినమే ప్రాణేశ్వర నగరప్రవేశతూర్యనాదామృతముం గ్రోలుఁగాక. గౌరీపూజాపరిశేషిత కుసుమోత్కరంబులో ప్రాణేశపాదములం బూజించెద.

[అని మరల గౌరిం బూజించుచు పాడును.

[చేటికలు వాద్యములు వాయింతురు.

హిందూ. కాపి రాగము. రూపకతాళము.

నీవే గతి గావే, * నిటలాక్షు రాణిరో,
కావవే వేగమే, వేగమే. నీవే.
శరణుఁ జొచ్చితి నీ చరణము తల్లిరో,
కరుణతోఁ జూడవే, చూడవే. నీవే.
తెల్లమయ్యె నా యుల్లమీ వేళ,
తల్లిరో, ప్రోచితే, ప్రోచితే. నీవే.

---

* ఫాలనేత్రునియొక్క (శివునియొక్క)

గౌరీ మ హేశులు కాతుర న్నమాట,
సారము, చేసితే, చేసితే. నీవే.
నిన్నె నేఁ గొల్వ నిఖిలజ న్మముల
నెన్న వే యీశ్వరీ, యీశ్వరీ. నీవే.
* కల నీ కథ, నిద్ర కలఁగని ధ్యానము,
తెలివి నుతి, సేయవే, సేయవే. నీవే.
చుక్క లన్ని పూవు, లక్కడలి పన్నీరు,
† లెక్క చేతుల్, సేయవే, సేయవే. నీవే.
మ్రొక్కఁగయిఁ కొమ్మా, మ్రొక్కెగె కోవమ్మా,
మ్రొక్కెద నోఁయమ్మా, ఓయమ్మా. నీవే.

[ముత్తయిదువులు పాడుదురు. చేటికలు వాద్యములు వాయింతురు.

ఆనందభైరవి రాగము. రూపకతాళము.

గిరిరాజతనయా, రక్షింపు;
వరము లొసఁగి మమ్ము వాసిగాఁ బెంపు. గిరిరాజ.
అళిక నేత్ర మొకటి, యర్థాంగ మొక్కటి,
తళుకు ‡ లే నెలపూవు తల నొక్కటి,
కులుకుసిం గపుఁదేజి కొడుమయు, గుఱులుగా
వెలసి లోకము లేలు విశ్వేశురాణి. గిరిరాజ.
§ వాకు వా కున నాను ¶ భారతీదేవినీ,
+ ఏకస్థానము లేని యిందిరను,

* కల—నాస్వప్నావస్థ నీచరిత్రగాను, నానిద్ర నీధ్యానముగాను, నాజాగ్రదవస్థ నీస్తోత్రముగాను చేయుము. † లెక్క—లోకములో సంఖ్య లెంతవఱ కుండునో అన్ని చేతులు నాకిమ్ము. ‡ లేనెల=లేఁతచంద్రుఁడు. § వాకువాకునన్=ప్రతివారినోటను ¶ సరస్వతిని, + ఒకచోట స్థిరముగా నుండని లక్ష్మిని.

మేకొనక దయితు మేనసె నెలకొని,
లోకము లేలుత్రై లోక్యజనని. గిరిరాజ.

[చేటికలు పుష్పాదికములను తెచ్చి యుంతురు. రాణి వానిని పరీక్షించుచు యథాస్థానముల నుంపించును.

పురోహితపుత్త్రుఁడు సంభావనీయబ్రాహ్మణులతో వేణుశాలం బ్రవేశించును.

ఒక వృద్ధబ్రాహ్మణుఁడు (అవధానులవారు)—[ప్రవేశించుచు]

'ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్.
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహమ్.'

కూర్చున్నబ్రాహ్మణులు.—అబ్బో! అవధానులవారా! రండి రండి, ఇక్కడ ఇక్కడ. [అని వారిని సగౌరవముగా కూర్చుండఁ బెట్టుదురు. వారును కూర్చుంటలో పడఁబోయి కూర్చుందురు.

ఇతరులు.—పెద్దకాలము!

మఱియొకబ్రాహ్మణుఁడు [కుండలధారి చయనులవారు].—[ప్రవేశించుచు]

'హరే రామ హరే రామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే.'

ఇతరులు—రండి రండి, చయనులవారు. నీవు లేరా.

[అని చిన్నవాని నొకని జరిపి ఆయనను కూర్చుండఁ బెట్టుదురు.

పురో.—[వీరికడకు వచ్చి] ఇన్నాళ్లు ప్రార్థింపఁగా ప్రార్థింపఁగా ఈ దినము చయనులవారు అనుగ్రహించినారు.

చయనులు.—నాయనా, మీరా? మహాదేవయ్యగారా? ఈదినము కూడ అగ్నిహోత్రము అయిన తర్వాత ఉపనిషత్తులు పారాయణము చేసికొను చుండి యిక్కడిమాట మఱవనే మఱచితిని. తర్వాత మనుమరాలు జ్ఞాపకము

చేయఁగా వచ్చితిని. మీ పరిపాలనను పొందియున్నాము. మీరుండ నేమో మోటమి లేక యుండవచ్చునా?

మఱియొక బ్రాహ్మణుఁడు [కుండలధారి సోమయాజులవారు]— [ప్రవేశించుచు]

'శివం శివకరం శాన్తం శివాత్మానం శివోత్తమమ్
శివమార్గ ప్రణేతారం ప్రణతోఽస్మి సదాశివమ్.'

వేదికడ ఎన్ని గుంటల్లు పెట్టినను కాళ్లు నొప్పి లేదు. ఈ ద్వారములు దాఁటి ఈ సోపానములు ఎక్కునప్పటికి నా పని ఆయినది.

ఇతరులు.—ఓహో! విశ్వేశ్వర సోమయాజులవారు! ఇన్నాళ్లకు గ్రామము విడిచి దయచేసినారు. ఇక్కడ ఇక్కడ.

[అని సగౌరవముగా కూర్చుండఁ బెట్టుదురు.

పురో.—బహుదినములకు కటాక్షించితిరి. సోమిదేవమ్మగారు కూడ వచ్చినారా?

సోమ.—మాయింటిదా, వచ్చినది. దానివలననే యింత యాలస్యము.

సోమిదేవమ్మ.—[ప్రవేశించుచు నవ్వుతో అత్త.] ఇక్కడి కొచ్చినా తప్పులేనా?

పురోహితభార్య.—రండి సోమిదేవమ్మగారూ, రండి. [అని ఆమెను రాణి కడకుఁ గొనిపోయి కూర్చుండఁబెట్టి, కోడలితో] అమ్మా జగదంబికా, మనము ముత్తయిదువులను పూజింతాము రావే అమ్మా.

పురో.—[తనకుమారునితో] మహేశ్వరా, బ్రాహ్మణపూజ కానీ.

[రాణి చందనపుష్పతాంబూలాదులను సంస్కారవంతములనుగాఁ బరికించి చేటికల చేత మహేశ్వరయ్యకడకును జగదంబికమ్మ కడకును బంపును. వారు బ్రాహ్మణులకును ముత్తైదువులకును వినియోగింతురు.

పురో.— ముందు చయనులవారిని పూజింపుము.

చయనులు.—సోమయాజులవా రున్నారు, మహానుభావులు, వారిని పూజింపుము నాయనా ముందు. ఇంక పెద్ద లెవరున్నారో చూడు బాబూ.

సోమ.—తమరే ఇచట వయోవిద్యాకర్మజ్ఞానజ్యేష్ఠులు. సాక్షాత్తు అవస్తంభుల వారే. బాబూ చయనులు గారికే కానిమ్ము నాయనా.

[మహేశ్వరయ్య చయనులవారికి చందనాదికము ఇచ్చును.

చయనులు.—మ జేమి చేయవచ్చును! పెద్దలమాట తప్పఁగూడదు.

[అని గ్రహించును. ఒకరిద్దఱు బ్రాహ్మణకుమారులు లేచి యితరులకు చందనాదికము సమర్పింతురు.

చయనులు.—[మహేశ్వరయ్యతో] నాయనా, మహాపుణ్యజన్మము మీది, 'కర్తాకారయితా' అన్నారు పెద్దలు. [బ్రాహ్మణపూజ జరుగును.

ఒక బ్రాహ్మణుఁడు.—[ప్రక్కవానితో]

క. ఈ మాన్యవృత్తపావన
సామీప్యంబందు నున్న సమయం బెల్లన్
నామదిఁ దోఁచు మథురలో
నా మీనేక్షణసమీపమం దున్నగతిన్. 1

మఱియొక బ్రాహ్మణుఁడు.—

క. గోరఁగల *వామ లెల్లరు
నీ రాణిని నీమెపూజ నీక్షించినచో
సారమతి నల్లయనసూ
యారుంధతు లగుట యొక్క యంకిలి యున్నే! 2

ఇంకొక బ్రాహ్మణుఁడు.—సాక్షాత్తు ఆ కాశివిశాలాక్షి ఇట్లవతరించినది.

[మహేశ్వరయ్యవరహాలు పళ్లెరముతో బ్రాహ్మణులకు కుమ్మరించును.

కొందఱు బ్రాహ్మణులు.—[వరహాలు ఉత్తరీయములో కట్టుచు] ఏమయ్యా, మహేశ్వరయ్యా, ఇరుసలతోఁ గొలిచి కుమ్మరించుచున్నావు? మోయలేము బాబూ.

---

1. ఈమాన్యవృత్త=మాననీయమైన చారిత్రముగల యీరాణియొక్క
2. * కుటిలస్త్రీలు.

మహేశ్వ.—కోపగింపకుఁడు స్వామీ, కోపగింపకుఁడు; ఇంకొకపద్యము.
ఇంకొకపద్యము. [అని మఱల మఱల పదములు నమస్కరించును.

ఆముగ్గురు బ్రాహ్మణులు.—అయ్యా, పిల్లపౌరోహితులూ.

(సీసము.)

ఒక.—సాధించిరో నీదుజనకు లీదేవికై *భూరిసమాకృష్టిభైరవంబు ?
మఱియొక.—కాదేని, చేసిరో కనకధారాస్తోత్ర బీజాక్షరాదిసంయోజనంబు?
ఇంకొక.—అది కాదు, సిద్ధించె నలకుబేరోపాస్తి.
ఒక.— దొరకెంబో వీరికిఁ † బరసువేధి.
మఱియొక.—వశ మయ్యె నితనికి పటయక్షి
ఇంకొక.— యది గాదు, ‡ నిధ్యంజన మితండు నేర్చినాఁడు.
ఒక.— కంటె చేర్పుపొరంగంబు § కనకగిరికి?
నెచటి దన్నిది నెలలుగా నీ విధమున
వచ్చుబ్రాహ్మణ్యమున కెల్లఁ బైఁడిరాశి
దెచ్చి యిచ్చెదవు, వచింపు ద్విజవరేణ్య. 3

మహే.—ఆ. జగతి నేల వెలసి సాక్షాన్మహాలక్ష్మి
సింహపీఠి నధివసించి పేర్మి
నవనిధులను వితరణము సేయుచుండఁగ
బొచ్చె మేమి కలుగు భూసురేంద్ర? 4

చేటి.—ఈ రత్న రాసులు కూడ వినియోగము చేయుమన్నారు
దేవిగారు. [అని అందించును.

---

3. *స్వర్ణాకర్షణభైరవ మనుమంత్రమును. దానిసిద్ధిచే అమితముగా బంగారము దొరకును. †ఇనుమునకుం దగిలించిన ఆయినుమును బంగారము చేయుంవస్తువిశేషము. ‡నిక్షేపములను జూపుకాటుక. § మేరుపర్వతమునకు (అది యంతయుం బంగారము.)

మహేశ్వ.—స్వామీ, బంగారము భార మని యవి పంపినారు. పుచ్చుకొండి మహానుభావులారా. [అని విప్రులకు సమర్పించును.

ఆముష్యవరు బ్రాహ్మణులు.—భార మన్నందులకు దండన యిది. నీచిత్తము. [అని పుచ్చుకొందురు.

ఒక ముత్తయిదువ.—బంగారం మహాలక్ష్మి. ముత్యాలు కెంపులు వజ్రాలు అన్నీ మహాలక్ష్మి, వద్దనరాదు. ఇన్ని యిన్ని బోషాణాలైనా చాలడం లేదు. వొచ్చిపుచ్చుకొకపోతే, అబ్బో! వైదికుల కెంతగర్వమో అంచారు. ఒకనాడైనా మోయగలిగేలాగ యియ్యరు. మాయిళ్లలో శెనగలైనా యిన్ని వాయనం పెట్టలేము.

జగదంబిక.—అమ్మ గాదూ, మాతల్లి గాదూ, ఇక వొకటే పల్లెం, వొకటే. [అని ఒక్కొక్కరికి పదల పదల బలవంతముగా వరహాలు, ముత్తెములు, ఇతరవస్తువులును, సమర్పించును. ముత్తయిదువలు మూటకట్టుకొందురు.

ఒక బ్రహ్మచారి.—కాంచనపువ్వులరాశివలె తళతళలాడే గనఁగా కన్నులు సుడి తిరుగుచున్నవి, మిఱుమిట్లు గొనుచున్నవి. ఏల మనకీడబ్బు? దీనిని మన మేమి చేయఁగలము?

ఒకఁడు.—పెండ్లి చేసికొమ్ము.

ఆ బ్రహ్మచారి.—దీనికి వ్యయము లేదుగదా, వరదక్షిణాది లాభమే గాని?

ఆ యొకఁడు.—తరువాత యజ్ఞము చేయుము.

ఆ బ్రహ్మచారి.—బళి బళి.

ఒకఁడు.—నేను ఈయేడు నెలల ధనముతో కాశిలో శాశ్వతసత్రము వేసెదను.

,, [అపవారించి ప్రక్కవానితో]

క. తురకలకొలువునకుఁ ని
ర్ధారణముగా నీధనమున సఖులమ్మున నే

దర్శించి కాశీ, రామే
శ్వరుఁ బొడఁగని, పడయుదువాఁడ శాశ్వతశుభముల్. 5

ప్రక్కవాఁడు.—[అపవారించి పేసితో] నా యీ సర్వధనములో,

క. గ్రామగ్రామంబునఁ గా
శీమార్గములన్ హిమాద్రిసేతులు దాఁకన్
ధామమకోలంకు లిడెద మ
హామహదసైన్యప్రపమున్నమలికిం బ్రతిగాన్. 6

ఒకఁడు.—నేను నాకొమార్తెకు పెండ్లిచేసెదను.

,, ఈ క్షేత్రమున జీర్ణాలయములు లేవు. నేను పరదేశముల జీర్ణోద్ధారములు చేయించి మాన్యము లిచ్చెద.

,, నేను విద్యార్థులకు వస్త్రసోపేతముగా భోజనము పెట్టుటకును, సకలోపచారములు జరుపుటకును, లేనిచోట్ల నెల్ల సత్రములు వేసెదను.

[రాణి ముత్తైదువులకు నమస్కరించును.

ముత్తైదువలు.—నీవూ నీప్రాణేశ్వరులున్నూ కడుపునిండా కడుపెడుపిల్లలను గనుకొని ఆపార్వతీపరమేశ్వరులలాగ శాశ్వతంగా భూమి పాలిస్తూవుండండి.

రాణి.—[వామాక్షిస్పందనము సూచించి పురోహితభార్యతో] అవ్వగారూ, నాయెడమకన్ను అదరుచున్నది.

పురో. భార్య, ముత్తై.—శుభం, శుభం, శుభం.

ఒకచేటి.—[వడివడిగా ప్రవేశించి] దేవీ, దేవీ, ఏలినవారు గడికోట కొచ్చినారు. [రాణి హర్షాశ్రువులతో తనమెడలోనిహారమును చేటి మెడను వైచి, ఆభరణము లూడ్చి దాని కిచ్చును.

చేటి.—[ఆభరణములు గ్రహించి రాణిపాదములకు మ్రొక్కి] తల్లీ, ఇంక జాములో పరిశన మని మంత్రిగారు మనవి చేయుమన్నారు.

